శ్రీమతే రామానుజాయ నమః



సాంప్రదాయిక వ్యాస మాలిక - 4

# తైత్తిరీయోపనిషత్తు-శీక్షావల్లి,
# భగవత్కృపావైభవం,
# దివ్య మంగళ విగ్రహ వైభవం,
# భగవంతుని కృతిత్వగుణం


<u>సంపాదకుడు:</u>

ఈయుణ్ణి అనంత రంగ రామన్





**‘అభినవ దేశిక’ ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ తిరుమలై వాత్స్య వీరరాఘవాచార్యస్వామివారు**





'న్యాయవేదాంత విద్వాన్'
ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, నరసాపురం

# విషయ సూచిక

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# తైత్తిరీయోపనిషత్తు-శీక్షావల్లి

('అభినవ దేశిక' ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూర్ తిరుమలై వాత్స్య వీరరాఘవాచార్యస్వామివారు అనుగ్రహించినది)

విధాయ వేధసం తస్మై
ప్రాహిణోద్యః త్రయీం పురా,
తస్మై నారాయణాయాస్తు
మంగళం మోక్షహేతవే.

కృష్ణయజుర్వేదంలో ఉండే తైత్తిరీయారణ్యకంలోని 5వ ప్రశ్న, ఆరవ ప్రశ్న తైత్తిరీయో- పనిషత్తు అని చెప్పబడుతున్నవి. మొదటి ప్రశ్నలో శీక్షావల్లి, ఆనందవల్లి(బ్రహ్మవల్లి), భృగువల్లి అని మూడు విభాగాలు ఉన్నాయి. శ్రీశంకరాచార్యులవారు, శ్రీ ఆనంద తీర్థులు ఈ ఒక ప్రశ్నకే వ్యాఖ్యానాన్ని అందించారు. 108 ఉపనిషత్తులతో కూడిన గ్రంథాలలో ఈ ప్రశ్న మాత్రమే తైత్తిరీయోపనిషత్తుగా చూపబడినది. ఆరవ ప్రశ్న అయితే **నారాయణోపనిషత్** అనే పేరుతో ముద్రింపబడింది. ఈ విధంగా వేరుగా విభాగింపబడినా, వాస్తవానికి ఇవి రెండు ప్రశ్నలు ఒకదాని వెంట ఒకటి చేరి ఉన్నందున, ఇవి అన్నీ కలిపి తైత్తిరీయోపనిషత్తుగా భావించడంలో అడ్డు లేదు. సమంజసమే. ఈ రెండిటిని ఒకే గ్రంథంగా చేసి, వేరువేరుగా మంగళ శ్లోకాలను అందించకుండా ఉపనిషద్భాష్యకారులు శ్రీరంగరామానుజముని తమ వ్యాఖ్యానాన్ని అందించారు. ఈ విధంగానే దానికి ముందు కాలంలో ఉన్నవారైనా కూరనారాయణజీయర్, భట్టభాస్కరులు కూడా ఈ విధంగానే ఒక గ్రంథంగానే భావించారు. ఆరవ ప్రశ్న అయిన నారాయణ ఉపనిషత్తుకు శంకరాచార్యులవారు మొదలైనవారు వ్యాఖ్యానాన్ని అందించక పోయినా, భట్ట భాస్కరులు, విద్యారణ్యులు, ఇంకా పలు సంప్రదాయాలకి చెందినవారు పలువురు వ్యాఖ్యానాన్ని రచించారు

ఈ రెండు ప్రశ్నలకు 'సాగ్ంం హితీ ఉపనిషత్తు', 'వారుణీ ఉపనిషత్తు', 'యాజ్ఞికీ ఉపనిషత్తు' – అని మూడుగా విభాగం కూడా ఉన్నది. మొదట 'సాగ్ంం హితీ' ఉపాసనతో ప్రారంభమవు-తున్నందున శీక్షావల్లికి 'సాగ్ంం హితీ' అనే పేరును పెట్టారు. ఆనందవల్లి, భృగువల్లి, అనే ఈ రెండు ఆనంద విద్యను తెలుపుతున్నందున, "**సైషా భార్గవీ వారుణీ విద్యా**" అనే సూక్తికి తగినట్లు ఆ రెండు వారుణీ విద్య అనే పేరును పొందాయి. తరువాత ఉండేది నారాయణో పనిషత్తు. ఇది యాజ్ఞికీ ఉపనిషత్తు.

ఈ విధంగానే అని 'శీక్ష' అనే వేదాంగంలోని విషయాలను తెలిపే శీక్షాధ్యాయం మొదట ఉన్నందున, మెదటి ఉపనిషత్తుకు శీక్షావల్లి అని పేరు. ఆనందమయ విద్యను బోధించడానికి వచ్చిన తరువాతి ఉపనిషత్తుకు భగవానుని ఆనందం అపరిచ్ఛేద్యమని తెలిపినందున దానికి ఆనందవల్లి అని పేరు. "**బ్రహ్మవిదాప్నోతి పరమ్**" (పరమాత్మను గూర్చి తెలిసినవాడు ఆ పరమాత్మనే పొందుతున్నాడు) అని మొదట బ్రహ్మ శబ్దం ప్రారంభంలో ఉన్నందున **బ్రహ్మవల్లి** అని పేరు కలిగింది. ఇది వారుణీ ఉపనిషత్తులోని ముందుభాగం. తర్వాత భాగమైన మూడవ వల్లి - ఈ విద్యను భృగువుకు అతని తండ్రి అయిన వరుణుడు ఉపదేశించిన రీతిని వివరిస్తున్నందున భృగువల్లి అన బడుతున్నది.

రెండవ ప్రశ్న అయిన నారాయణ వల్లి, నారాయణుడు అనే మహర్షిచే దర్శింపబడినందున నారాయణోపనిషత్ అని పేరుపొందినదని అంటారు. మధ్యలో నారాయణానువాకాన్ని కలిగినందున, ఇందులో పూర్తిగా నారాయణుడు చక్కగా వివరింపబడినందున నారాయణోపనిషత్ అని, అతనిని ఆరాధించే విధానాన్ని వివరిస్తున్నందున 'యాజ్ఞికి' అని చెప్పబడుతున్నదని చెప్పవచ్చు. ఈ ప్రశ్న నిత్యకర్మానుష్ఠానంలోనూ, పంచకాలప్రక్రియలోనూ చోటు చేసుకుంది

## శీక్షావల్లి:

ఈ ఉపనిషత్తులో మొదట ఉండే శాంతిపాఠం ఐతరేయ ఉపనిషత్తులోని శాంతిపాఠం వంటిది.

రాత్రి, పగలు ఎల్లప్పుడు వేదాన్ని అధ్యయనం చేయగోరే నాకు, ఈ రాత్రికి పగలుకు అధిదేవతలైన మిత్రా వరుణులు నా కరణ కరణకళేరాలకు అభిమాని దేవతలై, త్రివిక్రమమూర్తి వరకు ఉండే దేవతలందరు, వేదంగా పరిణమించే వాయుదేవత నాకు సుఖాన్ని కలిగించి, నన్ను వేదాన్ని చక్కగా ఆధ్యయనం చేసేటట్లు చేసి, నన్ను, నా గురువులను రక్షించాలి–అనేది ఈ శాంతిపాఠం లోని తాత్పర్యం .

మోక్షమనే గొప్ప ఫలాన్ని పొందడానికి తగిన ఉపాయాలను ఉపదేశించడానికే ఉపనిషత్తులు ఆవిర్భవించాయి. కరణకళేబరాలు అనబడే ప్రాణం, ఇంద్రియాలు, శరీరాలు లేకపోతే జీవుడు మోక్షోపాయాలను ఆచరించలేడు. **"శరీరమ్ ఆద్యం ఖలు ధర్మ సాధనమ్"** అని కదా సూక్తి. ఈ విధంగా కరణ కళేబరాలు అనే ఉపకరణాలు లేకపోతే ఏమి ప్రయోజనం? ఏ పని చేయడానికి వీలు లేదు కదా! భగవానుడు కూడా భోగ్య భోగపకరణాలను పలు విధాలుగా సృష్టించడం, పలువురు జీవులు పరస్పరం కలసి బతికేటట్లు నియమించడం మొదలైన సౌకర్యాలు చేయకపోతే వీరిని కృతార్థులను చేసి మోక్ష స్థానానికి తీసుకుని పోవడం సాధ్యం కాదని భావించి, వానిని ఏర్పాటు చేశాడని చెప్పాలి. అందువల్లనే భగవంతుని పొందడం కోసం ఉపాసన చేసేవారు పలు విధాలుగా ఇహలోక సుఖాలను ఆశిస్తారు. దానివల్ల, ఆ విధంగా వారు కోరే అల్ప ఫలాలకు కూడా తగిన సాధనాలను తెలుపవలసిన ఆవశ్యకత ఉపనిషత్తులకు కలుగుతున్నది. అందువల్ల వేదంలోని కర్మకాండలో కనిపించే పలు విధాలైన ఐహిక పురుషార్థాలకోసం ప్రయత్నించేవారికి–"అవి నశిస్తాయని, నిత్యంగా ఉండేవి కావని, అల్పమైనవి" అని తెలియజేసి వాటిపట్ల వారికి ఉండే కోరికను లేకుండా చేసినప్పుడు, పరమ పురుషార్థమైన భగవత్ప్రాప్తినిగూర్చి వారికి ఆశ కలుగుతుంది. అపుడు వారికి విస్తృతంగా మోక్షోపాయాలను ఉపదేశించడం కోసమే పుట్టినవి, ఈ ఉపనిషత్తులు. అందువల్ల ఐహికఫలాలను కోరేవారికి వాటికి తగిన పలు మార్గాలను వేదం ఉపదేశిస్తూ ఉన్నదని తెలియాలి.

ఈ తైత్తిరీయోపనిషత్ కూడా ప్రణవం, వ్యాహృతి – అనే వీనిని మంత్రాలుగా కలిగిన ఒక ఉపాసనను మోక్షంకోసం ఈ శీక్షావల్లిలో ఉపదేశిస్తున్నది. ఇంకా పలు ఉపాసనలను తరువాత

తెలుపబోతున్నది. అందువల్లనే ఇది ఉపాసనకు కావలసిన సౌకర్యాలకోసం పలు ఉపాయాలను తెలుపుతున్నది.

ప్రణవంలోని ఓకారం - 'అ'కార, 'ఉ'కారాల కలయిక వల్ల వచ్చినందున, ఈ విధంగా ఉండే సంహిత విషయంగా ఉపాసనను ఉపనిషత్తు రాబోయే రీతిలో తెలుపుతున్నది.

వేదానికి అంగంగా ఉండే శాస్త్రాలు ఆరు. వాటిలో శీక్షా అనేది ఒకటి. ఈ శాస్త్రంలో వర్ణం, స్వరం, హ్రస్వ దీర్ఘాది మాత్రలు, వాటిని ఉచ్చరించడానికి కావలసిన ప్రయత్నం, బలం, సంహిత అనే స్థానం అనేవి చెప్పబడ్డాయి. వీటిలో సంహిత విషయంగా ఒక ఉపాసనను తెలుపుతున్నది. సంహిత అంటే– కలయిక కదా! కలవడానికి రెండు వర్ణాలు, అంటే, రెండు అక్షరాలు కావాలి. ఇవే పూర్వరూపం, ఉత్తరరూపం అనబడతాయి. వీటిని కలిపే మార్గమనే స్థానం ఒకటి ఉన్నది. దాని ప్రకారం కలిపి ఏర్పడే రూపం సంధి అని, సంహిత అని చెప్పబడుతుంది. పూర్వరూపం, ఉత్తరరూపం, సంధి, స్థానం – అనే ఈ నాలుగు విషయాలలో లోక సంబంధంగా, జ్యోతి సంబంధంగా, విద్యా- సంబంధంగా, ప్రజా సంబంధంగా, శరీర సంబంధంగా చింతనలను విధింప- బడిన రీతిలో చేసేవారికి సంతానం, పశువులు, వేదార్థ విజ్ఞానంలోని స్పష్టత, స్వర్గం అనేవి ఫలాలుగా కలుగుతాయి. ఈ సంహితాభావనలోని ప్రకారాలకు మహాసంహితలు అని పేరు – అని ఈ విధంగా పలికిన ఉపనిషత్తు ఆ మహా సంహితలను ఇకపై వివరిస్తున్నది.

తరువాత, ప్రణవాన్ని స్తుతించి, దాని అనుగ్రహంవల్ల తనకు జ్ఞానం, ఆరోగ్యం చక్కగా మాట్లాడే సామర్థ్యం, అన్నిటినీ వినే రీతిలోనే శ్రవణ సామర్థ్యం కలగాలి–అని కోరాలని తెలుపుతున్నది. తరువాత, లక్ష్మీ స్తుతి, అన్నం, వస్త్రం, పశువులు, మంచివారితో సహవాసం, కీర్తి, గొప్పదనం, గొప్ప ఐశ్వర్యం అనేవి కలగాలని, ఐశ్వర్యసముద్రంలో మునిగి ఉండే తనకు దేహాత్మశుద్ధి, వేదవేత్తలు అందరూ అభిమానించి తన దగ్గరకు వచ్చే రీతిలోని గొప్పతనం – అనే ఇవి అన్నీ కలగాలని కోరే రీతిని తెలిపింది.

భూః, భువః, సువః – అనే మూడు వ్యాహృతులతో మహః అనే నాల్గవ వ్యాహృతిని కూడా కలుపుకోవాలి. మహః అనేదానికి – దేవతలందరూ తనకు శరీరమై, తాను ఆత్మగా ఉండే

పరమాత్మ–అని అర్థం. ఈ నాలుగు వ్యాహృతులలో, నాలుగు విధాలైన ఉపాసనలు ఉన్నాయి. వాటిని చేయడం వల్ల దేవతలందరూ కానుకలను సమర్పించి గౌరవించే రీతిలోనే బ్రహ్మవిద్య సిద్ధిస్తుంది. ఇటువంటివారు తమకు హృదయాకాశం మధ్యలో ఉండే, నాశనం లేని, అందమైన పురుషుని ఉపాసించి, చివరలో, హృదయం నుండి ఒక నాడి ద్వారా శిరస్సు మార్గంగా భేదించుకుని వెలువడి, అగ్నిలోక–వాయులోక– ఆదిత్యలోకాలలో నిలచి, పరమాత్మ దగ్గరకు చేరి, కర్మబంధం తీరగా శుద్ధమైన, అప్రాకృతాలైన ఇంద్రియాలను పొంది (అనంత-గరుడ-విష్వక్సేనాది నిత్య సూరులు అనుభవించే) బ్రహ్మానందాన్ని పూర్తిగా అనుభవిస్తారు–అని తెలిపింది.

ఆ తరువాత, పాంక్తోపాసనం తెలుపబడుతున్నది. (పంక్తి అంటే–ఒక ఛందస్సు. ఆ ఛందస్సులో ప్రతిపాదంలోను అయిదు వర్ణాలుంటాయి. అందువల్ల అయిదు కలిగినది అంతా పాంక్తమనబడుతుఃది). తన శరీరం లోపల అయిదు అయిదుగా 3 అయిదులు ఉన్నాయని, ఆ విధంగానే శరీరం బయట కూడా ఇంకొక మూడు అయిదులు ఉన్నాయని తెలియాలి – అనేది ఇంకొక ఉపదేశం. తర్వాత, "అంతా ప్రణవస్వరూపమే, ప్రణవం లేకపోతే ఏ వైదికధర్మం అనుష్ఠింపబడదు"– అనేది ప్రణవాన్ని గురించిన ఉపదేశం.

## గొప్ప తపస్సు:

లోకంలో గొప్ప సత్యాన్ని ఆరాధించడం, నశించని ఆత్మతత్వాన్ని యథాతథంగా గ్రహించి ఉపదేశించడం, ఉపాసనలనే తపస్సులను చక్కగా చేసి, బాహ్యేంద్రియాలను నియంత్రించుకోవడం. మనసును అదుపులో పెట్టుకోవడం, వైదికాగ్నులను సంపాదించుకోవడం, అగ్నిహొత్రాన్ని ఆరాధించడం, అతిథులను ఆరాధించడం, మానవుల కోసమైన మహొత్స- వాలను చేయడం, సంతానాన్ని ధర్మబద్ధంగా పొందడం, తగిన కాలంలో తన పత్నితో కలవడం, సంతతిని పొందడం–అని ఈ విధంగా ఉండే అన్ని ధర్మాలతో పాటు, అధ్యయనం, అధ్యాపనం–అనే రెండు అందరికీ తప్పక కావలసినవి .

రాథీతరుడు అనే ముని సత్యమే చాలు–అని అన్నాడు. పౌరుశిష్టి అనే ముని తపస్సు–మితమైన ఆహారంతో,

శాస్త్రనియమానుసారంగా శరీరాన్ని శుష్కింప చేయడమే–చాలు అని అన్నాడు. ఆయా విషయాలలో వారివారికి ఉండే శ్రద్ధను బట్టి ఆయా విధంగా వారు వారు చెప్పారు. అధ్యయనం, అధ్యాపనం – అనే ఈ రెండు చాలు – అని మౌద్గల్యుడు అనే ముని అన్నాడు. ఇవి ప్రధానమైన తపస్సు (ఏ కర్మానుష్ఠానం అయినా దుర్గుణాలను తొలగించి, సత్వగుణాన్ని పెంచి జ్ఞానాన్ని అభివృద్ధి చేయడంకోసమే. మిగిలిన కర్మలను చేసినప్పుడు కూడా, అధ్యయన–అధ్యాపనాలే సాక్షాత్తుగా జ్ఞానాన్ని కలిగి- స్తున్నాయి. కనుక అదే ముఖ్యమైన తపస్సు)

"అహంకార మమకారాలు తొలగినవాడనై స్థిరమైన కీర్తిని, గుణాలను పొంది, భగవానునకు భోగ్యంగా, భోగోప కరణంగా ఉండేవాడనై, జ్ఞానబలంతో స్థిరంగా నిలిచి ఉంటాను" – అనే అర్థాన్ని ఇచ్చే మంత్రాన్ని జపించాలి. ఇది త్రిశంకువుయొక్క ఉపదేశం.

ఆచార్యునివద్ద వేదాన్ని అధ్యయనం చేసి వస్తే చాలదు. ఆ ఆచార్యుని వలన మంచి మాటలను తప్పక విని రావాలి. ఆచార్యుడు శిష్యునకు ఉపదే- శించవలసినవి ఏమి? అంటే, "నిజాన్ని పలుకు, ధర్మాన్ని ఆచరించు, అధ్యయనాన్ని విడువకు, గురుదక్షిణను సమర్పించి ఆచార్యుని దగ్గరనుండి ఇంటికి వెళ్లి, సంతతి అభివృద్ధి అయ్యేటట్లు వివాహం చేసుకో. యోగక్షేమాలకు కావలసినవాటిలో అశ్రద్ధ చేయకు. తల్లి, తండ్రి, గురువు, అతిథులు – అనే వీరిని దైవంగా భావించు. దేవపితృకార్యాలలో అశ్రద్ధ చేయకు. మేము చేసిన వానిని అన్నిటిని మంచివని భావించకు. వాటిలో, వైదికధర్మానికి ఏ విధమైన విరోధం లేనివి ఏవో, వాటిలో ఏవి సదాచారాలలో, వాటిని మాత్రమే నీవు ఆచరించు. మాకు మించిన పెద్దలు కూడా ఉన్నారు. వారు ఉండే చోటును శ్రద్ధగా అన్వేషించు. వారి వద్ద వినయంతో, అణకువతో ప్రవర్తించు. దానం చేసేటప్పుడు శ్రద్ధతో చేయాలి. దానం చేసే వస్తువులలో సంగాన్ని విడవాలి. తన సంపదకు తగినట్లు ఇచ్చినా, అది చాలా అల్పమని సిగ్గుతో భావించాలి. శాస్త్రాలు చెప్పిన రీతిలో నడవాలి కదా – అనే భయంతో, ప్రయత్నపూర్వకంగా తెలిసికొని దానం చేయాలి. ఆచారాలలో దేనిని, ఎప్పుడు ఏ విధంగా చేయాలి? అనే సందేహం కలిగితే, దాని విషయంలో విచారించే సామర్థ్యాన్ని కలవారు, పండితులు, ఆచారశీలురు, ఆగ్రహం మొదలైన దోషాలు లేని వారు అయిన పెద్దలు వానిని ఏ

విధంగా ఆచరిస్తారో, నీవు కూడా వాటిని ఆ విధంగా ఆచరించాలి. ఇదే వేద రహస్యం. ఇదే పెద్దలు చివరిగా పలికేది. దీనిని ఈ విధంగానే తెలియాలి. ఆచరణలో పెట్టుకోవాలి".

ఈ విషయాలను ఉపదేశించిన తరువాత శాంతిపాఠంతో శీక్షావల్లి ముగుస్తున్నది.

**శీక్షావల్ల్యుదితా అర్థాః**
**సంగ్రహేణ యథామతి,**
**విజ్ఞప్తం శింగరార్యేణ**
**మోదాయాస్తికచేతసః**

# భగవత్కృపావైభవం

**(న్యాయవేదాంత విద్వాన్**
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, నరసాపురం**
**అనుగ్రహించిన వ్యాసం)**

భారతీయులందరికీ ప్రథమ ప్రమాణం వేదాలు. ఈ వేదాలను ఆధారంగా చేసుకొని పలు వైదికసిద్ధాంతాలు బయలుదేరాయి. వాటిలో కొన్ని సిద్ధాంతాలు పరమాత్మకు రూపం లేదని, గుణాలు లేవని, విభూతి లేదని ప్రతిపాదించగా, భగవద్రామానుజ సిద్ధాంతం భగవానుడు దివ్యమంగళరూపాన్ని కలవాడని, అన్ని కళ్యాణగుణాలను కలవాడని, దివ్యలీలలను కలవాడని, ఉభయవిభూతులను కలవాడని తెలుపుతున్నది.

భగవంతునకు ఈ విధంగా గుణాలు ఉన్నాయని, లేవని చెప్పడానికి వేదమే ఆధారం. వేదంలో కొన్ని వాక్యాలు భగవంతుడు కళ్యాణ గుణాలు కలవాడని తెలుపుతున్నాయి, మరికొన్ని అతనికి ఏ గుణం లేదని తెలుపుతున్నాయి. అందువల్ల ఈ నిర్గుణ వాదానికి, సగుణ వాదానికి వేదమే మూలం.

ఈ రెండు వాదాలకు వేదమే మూలం అని అన్నప్పుడు, ఇందులో ఏ వాదం సమంజసమైనది? ఈ రెండు ఒకదానికొకటి విరుద్ధం అయినప్పుడు, ఏదో ఒకటి సరైన వాదన అయి ఉండాలి తప్ప, రెండూ సరి అయినవి అని చెప్పే అవకాశం లేదు కదా! అప్పుడు, వేదంలో కొంతభాగం ప్రమాణం అని, మరి కొంత భాగం అప్రమాణం అని చెప్పే స్థితి ఏర్పడుతుందే! అందుచేత ఏ విధంగా ఏ వాదాన్ని సరి అయినది అని భావించాలి? అనే ప్రశ్న కలుగుతుంది.

భగవంతునకు గుణాలు లేవని చెప్పే వాక్యాలు వేదంలో **"నిష్క్రియం శాంతం"** ఇత్యాదిగా ఉన్నాయి. ఆ విధంగానే, భగవంతునకు కళ్యాణ గుణాలు ఉన్నాయి అని చెప్పే వాక్యాలుకూడా **"పరాఽస్య శక్తిః వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (ఈ పరమాత్మకు గల శక్తి అనే గుణం చాలా గొప్పది. అనేకవిధాలైనది. సహజమైనది. ఈ విధంగానే, జ్ఞానం,

బలం, క్రియా అనే గుణాలు కూడా ఇటువంటివే) అనేవి చాలా ఉన్నాయి. అందువల్ల ఈ రెండిటికీ అర్థంలో బాధ లేకుండా ఉండేటట్లు మనం సమన్వయం చేసుకోవాలి. ఏ విధంగా? అనేది చూద్దాం.

భగవంతునకు గుణాలు లేవు– అని చెప్పే వాక్యాలు ఏ తాత్పర్యంలో చెప్పబడినవని గమనిస్తే, భగవంతునకు గుణాలు లేవు అని చెప్పడంలోనే ఆ వాక్యాలకు తాత్పర్యం అని తెలుస్తుంది. ఎందుకంటే, భగవంతునకు బొత్తిగా గుణాలు లేవు అని పూర్తిగా నిషేధిస్తే, కళ్యాణ గుణాలు ఉన్నాయి అని చెప్పే వాక్యాలు పనికి రాకుండా పోతాయి. అందుచేత గుణ వాక్యాలకు, నిర్గుణ వాక్యాలతో అర్థాన్ని సందర్భానుసారంగా సమన్వయించాలి. భగవంతునకు చెడ్డ గుణాలు లేవు అని చెప్పడంలోనే నిర్గుణవాక్యాలకు దృష్టి–అని అర్థం చెప్పుకుని, సగుణ వాక్యాలకు భగవంతుడు కళ్యాణ గుణాలు కలవాడు అని అర్థం చెప్పుకుంటే ఏ బాధ ఉండదు కదా! ఇటువంటి సమన్వయాన్ని శ్రీరామానుజ సిద్ధాంతం చెపుతున్నది.

దీనికి కారణం కూడా వేదవాక్యాలే. వేద వాక్యాలలో కొన్ని ఘటకశ్రుతులు అనేవి ఉన్నాయి. ఈ వాక్యాలు భగవంతునకు హేయ గుణాలు లేవని, కళ్యాణ గుణాలు ఉన్నాయని తెలుపుతున్నాయి. **"ఆపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకోఽవిజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః"** (భగవంతుడు ఏ పాపం లేని వాడు, ముసలితనం లేనివాడు, మృత్యువు లేనివాడు, శోకం లేనివాడు, ఆకలి లేనివాడు, దాహం లేనివాడు, సత్యమైన కామాలను కలిగినవాడు, సత్యమైన సంకల్పాన్ని కలవాడు) అని మొదలైనవి ఈ వాక్యాలు. ఇటువంటి వాక్యాలకు అర్థం చెప్పాలంటే భగవంతునకు బొత్తిగా కళ్యాణ గుణాలు లేవు–అని అర్థం చెప్పే అవకాశం లేదు. ఆ విధంగా చెబితే పై వాక్యం అర్థం లేనిది అయిపోతుంది కదా.

అంతేకాదు, వస్తుప్రతీతిని చూచినా అది సగుణంగానే మనకు తోస్తుంది. ప్రతి వస్తువుయొక్క ప్రతీతి "ఇది ఈ విధంగా ఉన్నది" అనే రూపంలో సగుణంగా తోస్తుంది కదా! భగవద్రామానుజులు కూడా శ్రీ భాష్యంలో **"నిర్విశేషే వస్తుని ఇదం ప్రమాణమితి న శక్యతే వక్తుం, సవిశేషవిషయత్వాత్**

**సర్వప్రమాణానామ్"** (ప్రతి వస్తువు సవిశేషంగానే, అంటే, సగుణంగానే తోస్తున్నందున, నిర్విశేషమైన వస్తువు ఉన్నదని చెప్పడానికి 'ఇది ప్రమాణం అని' దేనినీ కూడా ఉదాహరించి చెప్పలేము) అని అన్నారు.

ఈవిధంగా చెప్పబడే సగుణ-నిర్గుణ వాక్య సమన్వయాన్ని పెద్దలు ఒకరు **"నిత్యం హేయగుణావధూననపరాః నైర్గుణ్యవాదా స్వయం, సత్యార్థాః సగుణోక్తయః శుభగుణప్రఖ్యాపనాః బ్రహ్మణః"** (వేదంలో నిర్గుణ వాక్యాలు భగవంతునకు హేయగుణాలు లేవని తెలుపుతున్నవి. సగుణ వాక్యాలు ఆ స్వామికి కల్యాణ గుణాలున్నాయని తెలుపుతున్నవి) అని చక్కగా చెప్పారు. ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీ రామాయణంలో వాల్మీకి మొట్టమొదట అడిగిన ప్రశ్న కూడా భగవంతుడు కల్యాణగుణాలను కలవాడు అనే విషయాన్ని తెలుపుతున్నది. **"గుణవాన్ కః"** అని కదా వాల్మీకి ప్రశ్న. పురాణ రత్నమనబడే శ్రీవిష్ణు పురాణం ఆరంభంలోకూడా ఈ సంగతి వ్యక్తమవుతున్నది. అక్కడ **"యన్మయం చ జగత్ సర్వమ్"** అనే మైత్రేయుని ప్రశ్నకు **"విష్ణోః సకాశాత్ ఉద్భూతమ్"** అని సమాధానాన్ని పరాశరమహర్షి పలుకడం కూడా దీనికి ఒక ప్రమాణం. ఇక్కడ పరాశర మహర్షి కల్యాణగుణ ప్రతిపాదకమైన విష్ణుశబ్దాన్ని ప్రయోగించి సమాధానం చెప్పాడు కదా. ఇందువల్ల భగవంతుడు సకలకల్యాణ గుణాత్మకుడు అనేది స్పష్టమవుతుంది. భగవద్రామానుజులు శ్రీ భాష్యంలోని మహా సిద్ధాంతంలో గల పురాణ ఇతిహాసఘట్టంలో పలు విష్ణుపురాణ శ్లోకాలను తీసికొని భగవంతుని సగుణత్వాన్ని నిరూపించారు. నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్ మొళి ప్రబంధ ప్రారంభంలో **"ఉయర్ నలముడైయవన్"** (భగవంతుడు గొప్ప ఆనంద గుణాన్ని కలవాడు) అని భగవంతుని సగుణత్వ ప్రతిపాదకమైన 'నల' శబ్దాన్ని ప్రయోగించడం కూడా ఇక్కడ గమనించాలి. దీనిని వ్యాఖ్యానించే పూర్వాచార్యులు ఈ 'నల'మనే పదం 'కేవలం ఆనంద గుణాన్నే కాక కల్యాణ గుణసామాన్యాన్ని తెలుపుతుంది' అని వ్యాఖ్యానించారు కూడా.

సంప్రదాయ ప్రవర్తకులలో అగ్రేసరులైన శ్రీయామునులు 'స్తోత్రరత్నం'లో **"సమస్త కళ్యాణగుణామృతోదధిః"** అని భగవంతుడు అన్ని కల్యాణ

గుణాలకు సముద్రునివంటివాడు– అని అన్నారు. శ్రీరామానుజులు కూడా శరణాగతి గద్యలో భగవంతుని దివ్యాత్మగుణాలను, దివ్యమంగళ విగ్రహగుణాలను విస్తృతంగా నిరూపించారు. ఇందువల్ల భగవంతుడైన శ్రీమన్నారాయణుడు ఏ హేయగుణాన్ని లేని వాడని, అన్ని కల్యాణగుణాలను కలవాడని తెలుస్తున్నది.

ఇటువంటి భగవంతుని కళ్యాణగుణాలు అనేకం. అందువల్లనే భగవంతునకు అనంతుడు అనే పేరు కలిగింది. **"నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతః"** అనే సూక్తి దీనికి ప్రమాణం. ఈ విధంగా భగవంతుని అంతు లేని గుణాలు రెండు వర్గాలుగా విభజింపబడ్డాయి. అవి **1) ఆశ్రయణసౌకర్యాపాదక గుణాలు 2 )ఆశ్రిత కార్యాపాదక గుణాలు** అనేవి. వాత్సల్యం, స్వామిత్వం, సౌశీల్యం, సౌలభ్యం, జ్ఞానం, శక్తి –అనే ఈ ఆరు మొదటి వర్గానికి చెందుతాయి. జ్ఞానం, శక్తి, ప్రాప్తి మొదలైన గుణాలు రెండవ వర్గానికి చెందుతాయి. మొదటి వర్గంలో కృప స్పష్టంగా చెప్పబడకపోయినా, వాత్సల్యం చెప్పబడినందున కృపను చెప్పినట్లే అవుతుంది. ఎందుకంటే, వాత్సల్యం అనేది కృపాప్రకార విశేషమేకదా. భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి ఈ గుణాలు చాలా ఆవశ్యకమైనవి. భక్తులు ఆశ్రయించడానికి, ఆశ్రయించిన భక్తుల కార్యాలను నెరవేర్చడానికి ఈ గుణాలు ఉపయోగపడతాయి. వీటిలో కూడా, కృప చాలా ముఖ్యమైనది. శ్రీయామునులు 'స్తోత్రరత్నం'లో **"కృపయా కేవలం ఆత్మసాత్కురు"** అని అంటూ భగవంతునితో కృపను ప్రదర్శించి తమను స్వీకరించమన్నారు. కూరేశులు 'అతిమానుషస్తవం' చివరలో **"త్వత్ జ్ఞానశక్తికరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్"** అని భగవంతుని జ్ఞానం, శక్తి , కృప ఉండగా ఆశ్రితుని దోషాలు తలఎత్తవు అన్నారు. ఆళ్వార్లుకూడా **"అరుళాల్ అళిప్పార్ ఆర్? ....కోపాలకోళరి ఏఱన్టియే"**– కృపతో రక్షించేవాడు భగవంతుడు తప్ప ఎవరు ఉన్నారు? అని అన్నారు. ఈ సూక్తులు అన్నీ రక్షణలో కృపాగుణప్రాధాన్యాన్ని తెలుపుతున్నాయి.

కృప అనే ఈ పదానికి దయ, అనుకంప, కారుణ్యం, కరుణ, ఘృణ, అనుక్రోశం ఇత్యాదిగా పలు పర్యాయాలు అమరకోశంలో చూపబడ్డాయి. వీటి వ్యుత్పత్తులను గమనించినప్పుడు కొన్ని విశేషాలు కనిపిస్తాయి. కరుణా, కారుణ్యం

అనే పదాలు "**కుర్వంతి ఆత్మానమ్ అధీనం అనయా ఇతి కరుణా, కరుణైవ కారుణ్యమ్**" అని వివరింపబడ్డాయి. దీనివల్ల కరుణా స్వభావం కలవారు ఇతరుల దుఃఖాన్ని చూసి సహించలేక, వారికి సహాయం చేయడం కోసం తమను వారికి అధీనంగా చేసుకుంటారు–అని తెలుస్తున్నది. ఈ దశ కరుణలో ఉన్నత దశ అని చెప్పాలి. స్వార్థాన్ని కూడా పూర్తిగా విడిచి, తనను పూర్తిగా ఇతరులకు అధీనం చేసికోవడానికి కరుణ కారణం అని తెలుస్తున్నది కదా. కృప అనే పదానికి "**కృపయంతే అనయా**" –దీనివల్ల దయను చూపిస్తారు–అనే వ్యుత్పత్తి చూపబడింది. ఆ విధంగానే దయ అనే పదానికి "**దయంతే రక్షంతి అనయా ఇతి దయా**" – ఈ గుణం వల్ల ఇతరులను రక్షిస్తారు అనే అర్థం తెలుపబడింది. ఇందువల్ల ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక, వారిని రక్షించే గుణం దయ అనబడుతుంది అని తెలుస్తున్నది. 'అనుక్రోశ'మనే పదం "**అను క్రోశంతి అనేనేతి అనుక్రోశః**" అని వివరింపబడింది. ఇతరుల దుఃఖాన్ని చూచి తాను కూడా దుఃఖించడం ఈ గుణం వల్లనే అని ఈ వివరణ వల్ల ఏర్పడుతున్నది. అనుకంప అనే పదానికికూడా ఇదే అర్థం. 'ఘృణ' అనే పదం "**ఘృణంతి సించంతి అనయా ఇతి ఘృణా**" అని వివరింపబడింది. ఈ గుణం వల్ల ఇతరుల దుఃఖాన్ని చూసి ద్రవిస్తారు-అని దీనివల్ల తెలుస్తున్నది. ఈ విధంగా ఈ వివరణలవల్ల కృపా గుణానికి 1)ఇతరుల దుఃఖాన్ని చూసి సహించలేక పోవడం, 2) ఆ దుఃఖాన్ని తీర్చాలని ప్రయత్నించడం, 3) ఇతరుల దుఃఖాన్ని చూచి తాను కూడా దుఃఖించడం అనేవి ప్రకారాలు అని తెలుస్తున్నది కదా!

ఈ కృపాగుణాన్ని మన పూర్వాచార్యులు విశేషంగా వివరించారు. శ్రీ రామానుజులు శరణాగతి గద్యలో భగవంతుని కృపను కారుణ్య శబ్దంతో నిర్దేశించారు. దీనిని శ్రుతప్రకాశికాచార్యులవారు "**స్వార్థానపేక్షా పరదుఃఖాసహిష్ణుతా**"–తన ప్రయోజనం ఏమీ లేకుండా ఇతరుల దుఃఖాన్ని సహించలేకపోయే స్వభావానికి 'దయ' అని పేరు–అని ఈ గుణాన్ని లక్షించారు. శ్రీ పరాశర భట్టర్ శ్రీరంగరాజ స్తవంలో "**దయా పరవ్యసనహరా**" అని నిర్వచించారు. ఇతరుల దుఃఖాన్ని తీర్చడానికి దయ అని పేరు– అని దీని అర్థం.

శరణాగతి గద్యలోని కారుణ్య శబ్దాన్ని పెరియ వాచ్చాన్ పిళ్లై విశేషంగా వివరించారు.

**"స్వార్థనిరపేక్షపరదుఃఖాసహిష్ణుత్వమ్"**– అని దీనిని వివరించారు. తనకు ఏ ప్రయోజనాన్ని కోరకుండా, ఇతరుల దుఃఖాలను సహించలేక దానిని తీర్చలని కోరడం దయ అనబడుతుంది–అని దీని భావం. దీనికి శ్రీరామాయణంలోని ఒక వృత్తాంతాన్ని వారు ఉదాహరించారు. వేటగాడు బాణంతో కొట్టబడిన క్రౌంచపక్షిని చూడగానే ధర్మాత్ముడైన వాల్మీకి మనసులో కారుణ్యం కలిగింది–అనే ఈ వృత్తాంతాన్ని ఉదాహరించడం ద్వారా ఇతరుల దుఃఖాన్ని చూచి తానుకూడా దుఃఖించడం అనేది కారుణ్యం అని వారు తెలియజేశారు. దీనినిబట్టి శ్రీ సుదర్శన భట్టర్ అనే పేరుగల శ్రుతప్రకాశికా-చార్యులవారు, పెరియవాచ్చాన్ పిళ్ళై ఒకే విధంగా కరుణను నిర్వచించినట్లు ఏర్పడుతున్నది. కానీ, ఇక్కడ వేదాంత దేశికులు కొంచెం అభిప్రాయభేదం తెలిపారు. "తనకు ఏ ప్రయోజనం కోరకుండా ఇతరుల దుఃఖాన్ని తీర్చాలనే కోరికయే కారుణ్యం. ఇతరుల దుఃఖాన్ని చూచి దుఃఖించడం కారుణ్యం కాదు. ఎందుకు? అంటే, కరుణ ఉండే చోట అంతా ఈ స్థితి (అంటే, ఇతరుల దుఃఖాన్ని చూచి దుఃఖించే స్థితి) కనిపించదు. అంతేకాక, కరుణ ఉండని చోట కూడా ఈ స్థితి ఉన్నందున అందరినీ నియమించే సర్వేశ్వరుడు దోషం చేసిన వారిని దండిస్తాడు–అని శాస్త్రాలలో చెప్పబడినందున, వీటికి విరుద్ధం కాకుండా కరుణ లక్షణాన్ని చెప్పాలి. లోకంలో కూడా ఆ విధంగానే కనిపిస్తున్నది" – అని దేశికులు అభిప్రాయపడ్డారు.

భగవంతుని గుణాలలో జ్ఞానం, బలం, తేజస్సు, ఐశ్వర్యం, వీర్యం, శక్తి అనే ఆరు ప్రధాన గుణాలు. ఇవి 'భగ'శబ్దంతో నిర్దేశింపబడుతున్నాయి. **"షణ్ణాం భగ ఇతీరణా"** అనికదా చెప్పబడుతున్నది. వీటిని కలిగినవాడు కనుక భగవంతునకు ఆ పేరు వచ్చింది. ఈ ఆరు గుణాలు నుండే మిగిలిన అన్ని గుణాలు ఉత్పత్తి అవుతున్నాయి–అని కూడా చెప్పబడుతున్నది . పరాశరభట్టర్ సహస్రనామ భాష్యంలో **"మహాద్యుతిః"** అనే నామాన్ని వివరిస్తూ **"ఏవం షట్స్వేవ సౌశీల్యవాత్సల్యాదయో గణితగుణాః, కేనాపి ప్రయోజనేన అంతర్భావ్యంతే"** – సౌశీల్యం, వాత్సల్యం మొదలైన అన్ని కళ్యాణ గుణాలు ఆయా ప్రయోజనభేదాన్ని బట్టి ఈ ఆరు గుణాలలోనే అంతర్భవిస్తాయి – అని అన్నారు. ఈ విధంగా గమనించినప్పుడు కృప అనే ఈ గుణాన్ని జ్ఞానగుణ ప్రకారంగా చెప్పవచ్చు.

ఈ కృపాప్రకారాలుగా వాత్సల్యం, క్షమ అనే రెండు గుణాలను చెప్పవచ్చు. కృప వల్లనే కదా దోషాలను క్షమించడమనే క్షమాగుణం, దోషాలను కూడా గుణాలుగా గ్రహించడం అనే వాత్సల్యం సంభవిస్తాయి. అందువల్ల వీటిని కృపా గుణానికి ప్రకారాలుగా చెప్పవచ్చు. ఇక్కడ ఒక సాంప్రదాయికమైన విశేషం కూడా ఉన్నది. భూదేవి, నీళా దేవులు ఇద్దరు లక్ష్మీదేవికి నీడవంటి వారని **"మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిళల్ పోల్వనర్"** అని 'తిరువిరుత్త' ప్రబంధంలో ఆళ్వారులు అభివర్ణించారు. ఇందువల్ల వీరిద్దరూ లక్ష్మీదేవికి ప్రకారాలు అని కదా అర్థం. ఈ క్రమంలో లక్ష్మీదేవిని దయాగుణంగాను, భూదేవిని క్షమాగుణంగాను, నీలాదేవిని వాత్సల్యగుణంగాను రూపిస్తూ పలికే క్రమం కూడా ఉన్నది. ఈ క్రమంలోనే దేశికులు దయాశతకంలో మూడు శ్లోకాలలో వరుసగా లక్ష్మీదేవిని, భూదేవిని, నీళాదేవిని స్తుతించారు–అని విజ్ఞుల అభిప్రాయం.

ఇంతకుముందు ప్రస్తావించిన రీతిలో ఈ కృపా గుణానికి కల మూడు విధాలైన ప్రకారాలను తెలిపే ఉదంతాలను కూడా మనం గమనించవచ్చు.

**1)పరదుఃఖాసహిష్ణుత్వం:**

ఈ గుణాన్ని కాకాసుర వృత్తాంతంలో గమనించవచ్చు. సీతాదేవి విషయంలో చెప్పడానికి వీలులేని అపరాధం చేసినవాడు కాకాసురుడు. అతడు వధించదగినవాడు. అతనిపై కోపించిన రామచంద్రుడు బ్రహ్మాస్త్రాన్ని మంత్రించి ప్రయోగించాడు. ఆ అస్త్రం అతనిని తరిమింది. కాకాసురుడు ముల్లోకాలూ తిరిగాడు. ఎవరి దగ్గర రక్షణ లభించలేదు. చివరికి అతని తండ్రి కూడా వదలిపెట్టాడు. ఆ సమయంలో అతడు గతిలేక స్వామి సన్నిధిలో వచ్చి పడ్డాడు. ఆ విధంగా బాధపడే కాకాసురుని చూచి రామునకు దయ కలిగింది. ఆ దయ కారణంగా అతనిని రక్షించాడు. ఈ విషయాన్ని రామాయణం **"వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** అని అన్నది. "భగవంతుడు కాకాసురుని శిక్షించాలని అనుకున్నా, దానికి అతని కృప అడ్డుపడింది. మనం ప్రారంభించిన కార్యాలు పూర్తి కాకుండా మన కర్మలు అడ్డు పడేటట్లు, భగవంతుడు ఆరంభించిన శిక్షణకార్యం కూడా కృపవల్ల అడ్డు పడుతుంది"– అనే విషయం

దీనివల్ల వ్యక్తమవుతున్నది– అని ఇక్కడ రామానుజీయ వ్యాఖ్య. కాకాసురుని బాధను చూడలేక అతనిని క్షమించినందున, అతనిపై ప్రయోగించిన అస్త్రాన్ని అతని కంటి పై గురి పెట్టి తద్వారా అతని ప్రాణాలను రక్షించినందున ఇక్కడ ఇతరుల దుఃఖం సహించ లేక పోవడం అనే కృపా ప్రకారం వ్యక్తం అయినది అని చెప్పవచ్చు.

**2)పరదుఃఖనిరాచికీర్ష:**

ఈ గుణవిశేషాన్ని సుగ్రీవుని విషయంలో మనం దర్శించవచ్చు. సుగ్రీవుడు వాలితో యుద్ధం చేసినప్పుడు వాలిచేత దెబ్బలు తిని, సహించలేక రాముని దగ్గరకు పరిగెత్తుకొని వచ్చాడు. అంతకుముందు సుగ్రీవుడు లక్ష్మణుని సరిగా గుర్తించక భాగవతాపచారాన్ని చేశాడు. ఆ కారణంగా రామచంద్రుడు అతనిని రక్షించక వదిలిపెట్టాడు. లేకపోతే మొదటి యుద్ధంలోనే వాలిని రాముడు సంహరించి ఉండేవాడు. **"ఏకం దుఃఖం సుఖం చ నః"** అనే విధంగా సుగ్రీవునితో సమానమైన సుఖదుఃఖాలను కలిగిన శ్రీరాముడు సుగ్రీవుడు లక్ష్మణుని అనుగ్రహాన్ని పొందేటట్టు చేశాడు. సుగ్రీవుని గుర్తించడానికి వీలుగా రాముడు అతని మెడలో గజ పుష్పమాలను లక్ష్మణునిచే అలంకరింప చేశాడు. ఇది ఒక విధంగా లక్ష్మణుని అభిమానాన్ని సుగ్రీవునకు కలుగజేయడమే. ఈ విధంగా రాముడు సుగ్రీవునిలో ఉండే దోషాన్ని సంస్కరించి, లేకుండా చేసి, ఆ తర్వాత అతనిని రక్షించాడు. ఇదంతా చేయడానికి కారణం అతని విషయంలో ఉండే కృపయే. ఇతరుల దుఃఖాన్ని తీర్చాలి–అనే కోరికయేకదా.

**3)పరదుఃఖదుఃఖిత్వం:**

ఈ గుణం కూడా సుగ్రీవుని విషయంలోనే దర్శించవచ్చు. వాలి మరణించిన తర్వాత సుగ్రీవుడు చాలా దుఃఖించాడు. అతని దుఃఖాన్ని చూసిన రాముడు కూడా క్షణకాలం చాలా దుఃఖాన్ని పొందాడు–అని వాల్మీకి మహర్షి **"సంజాతబాష్పః పరవీరహంతా రామో ముహూర్తం విమనా బభూవ"** (సుగ్రీవుని దుఃఖాన్ని చూచిన రాముడు ఒక క్షణకాలం చాలా దుఃఖాన్ని పొందాడు) అని అన్నాడు. ఇది ఇతరుల బాధను సహించలేక తాను కూడా బాధను పొందడం అనే గుణమేకదా. ఈ

గుణాన్ని **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** అనే రామాయణసూక్తిలో కూడా సమన్వయించవచ్చు.

ముక్తులు, నిత్యులు పరమపదంలో భగవంతుని కల్యాణ గుణాల అనుభవాన్ని పొందుతారని వేదం **"సోశ్నుతే సర్వాన్ కామాన్"** అని చెప్పింది. అక్కడ ఈ కృపాగుణం విశేషంగా ప్రకాశించకపోయినా దాని అస్తిత్వాన్ని తప్పక అంగీకరించాలి. లేకపోతే **"సర్వాన్ కామాన్"** అనే ప్రయోగంలోని 'సర్వ'శబ్దం నిరర్థకం కదా!

"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః" అని వేదం జీవునకు పరమాత్మతో పలు సంబంధాలు ఉన్నాయని తెలుపుతున్నది. వీటిలో, మాతృ సంబంధం వల్ల వాత్సల్యం, భ్రాతృసంబంధం వల్ల సౌశీల్యం , సుహృత్సంబంధం వల్ల సౌలభ్యం తెలుపబడగా,పితృ సంబంధం వల్ల కృప తెలుపబడుతున్నది అని చెప్పవచ్చు. "కరణకళేబరైః ఘటయితుం దయమానమనాః " అని కరణ కళేబర ప్రదానం కృపాకార్యమని చెప్పబడుతున్నది కదా. తండ్రి కూడా కరణకళేబరాలను ఇస్తాడు కనుక, పితృసంబంధంవల్ల కృప వ్యక్తమవుతున్నది చెప్పవచ్చు.

భగవంతుడు చేసే సృష్టి స్థితి లయాలు కృపాకార్యాలే.సృష్టి,స్థితి అనే రెండు కృపాకార్యాలు కావచ్చు. కానీ, లయం ఏ విధంగా కృపాకార్యం అవుతుంది? అని అంటే, మందులేని రోగం ఎవరికైనా వస్తే, ఇక అతనికి మరణమే సరియైన చికిత్స అయినప్పుడు,దానిని కలిగించి ఆ బాధనుండి అతనిని విడిపించడం కూడా కృపా కార్యమే కదా. ఇక్కడ ఇంకొక సందేహం కూడా కలుగవచ్చు.సృష్టి చేసేటప్పుడు భగవంతుని సృష్టి హెచ్చుతగ్గులుగా కనిపిస్తున్నదే. కొంతమందిని దేవతలుగా,కొంతమందిని మానవులుగా మరి కొంతమందిని పశుపక్ష్యాదులుగా భగవంతుడు సృష్టించడం పక్షపాతం అవుతుంది కదా. భగవంతుడు దయ లేనివాడు అని అర్థం వస్తుంది కదా! అనే సందేహం కలుగవచ్చు. అయితే ఇక్కడ భగవంతుడు చేసే సృష్టి ఆయా జీవుల కర్మలను అనుసరించి ఉంటుంది కనుక పక్షపాతం అనే ప్రసక్తి ఎంత మాత్రం లేదు. సృష్టి సమయంలో కూడా జీవుల కర్మలు సూక్ష్మ రూపంలో ఉంటాయి. వాటిని అనుసరించి భగవంతుడు సృష్టి చేస్తాడు

కనుక, దోషంలేదు. ఆ విధంగానే కర్మఫలాన్ని అనుసరించి అతడు సృష్టి చేయడం కూడా మట్టిని తినే కుర్రవాని నాలుకపై వాత పెట్టి భయ పెట్టినట్లుగా, ఆయా జీవులు మళ్ళీ పాపాన్ని చేయకుండా నిరోధించడంలోకే వస్తుంది. కనుక, ఇది కృప లోకే చేరుతుంది–< అని తత్వ త్రయలో తెలుపబడడం ఇక్కడ స్మరించాలి.

ఇటువంటి మహా వైభవాన్ని కలిగిన కృపాగుణానికి "**అహమస్మి అపరాధానామాలయః**" అని, "**అహమస్మి అపరాధచక్రవర్తీ**" అనే విధంగా అపరాధాలుతో నిండిన మనమందరం లక్ష్యం కావాలి. ఆ స్వామి అనుగ్రహాన్ని పొంది తరించాలి.

# దివ్య మంగళ విగ్రహ వైభవం

**(న్యాయవేదాంత విద్వాన్**
**ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, నరసాపురం**
**అనుగ్రహించిన వ్యాసం)**

భగవద్రామానుజ సిద్ధాంతం 'భగవంతుడు స్వరూప రూప గుణ విభూతి లీలలను కలవాడు' అని తెలుపుతున్నది. భగవంతుని దివ్యమంగళరూపానికి శుభాశ్రయం అని పేరు. ఈ దివ్య మంగళ విగ్రహ వైభవాన్ని కొంచెం దర్శిద్దాం.

లోకంలో జీవులకు కూడా శరీరం ఉంటుంది. ఈ శరీరం త్యాజ్యం. ఇది వారి కర్మ వల్ల వచ్చినది. ఈ శరీరం నశిస్తేగాని సుఖదుఃఖాల స్పర్శ జీవునకు తీరదు. "**అశరీరం వావ సంతం ప్రియాప్రియౌ న స్పృశతః**" అని వేదం తెలుపుతున్నది. ఇంతే కాదు, లోకంలో శరీరానికి "**ఆస్తి, జాయతే, పరిణమతి, వివర్ధతే, అపక్షీయతే, వినశ్యతి**" అనే ఈ విధంగా ఆరు విధాలైన వికారాలు ఉన్నాయి. ఈ విధంగా వికారాస్పదమై, అందువల్ల చాలా హేయమైన శరీరం భగవంతునకు కూడా ఉన్నదని పలకడం తగినదా? జీవునకు ఉండే శరీరంవంటిదేనా భగవంతుని శరీరం? అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది.

ఇక్కడ కొన్ని విషయాలను గమనించవలసి ఉన్నది. లోకంలో జీవుని శరీరం భోగాయతనం. అంటే, భోగాన్ని అనుభవించడానికి భగవంతుడిచ్చిన స్థానం అని అర్థం. అందువల్ల అది, వారు వారు చేసిన కర్మలకు తగినట్లు అనేక విధాలుగా ఉంటుంది. అంతే కాదు, కర్మ సంబంధం చేత వచ్చినది కనుక చాలా హేయంగా ఉంటుంది. అళ్వార్లు దీనిని "**అఱుక్కుడంబు**" (మురికిశరీరం) అన్నారు. కానీ, భగవంతుని రూపం అటువంటిది కాదు, దీనికి దివ్య మంగళ విగ్రహం అని పేరు. ఇది భోగాయతనం కాదు. జీవుని శరీరం వలె రక్తమాంసాలతో ఏర్పడినది కాదు. అందువల్ల హేయం కాదు. "**న తస్య ప్రాకృతా మూర్తిః మాంసమేదోస్థిసంభవా**" అని అన్నది శాస్త్రం. ఆళ్వార్లు కూడా "**మాశూణా చ్చుడరుడంబాయ్

**మలరాదు కువియాదు"** అని భగవద్రూపం దోషాలు ఏమీ లేనిది అని, వికారాలు ఏమీ లేనిది అని అన్నారు.

భగవంతునకు దివ్య మంగళ రూపం ఉన్నది అనే విషయాన్ని పలు వేదవాక్యాలు, ఆళ్వారుల సూక్తులు స్పష్టం చేస్తున్నాయి. **"తస్య కప్యాసం పుండరీకమేవ మక్షిణీ-----ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః"** (సూర్యమండలంలో ఉండే పరమాత్మకు తామర పూలవంటి రెండు కన్నులు ఉన్నాయి. పాదంనుండి తల వరకు అతని రంగు బంగారు రంగు) అని మొదలైన వేదసూక్తులు, **"శుట్టురైత్త నన్ పొన్ ఉన్ తిరుమేని ఒళి ఒవ్వాదు"** (కాచి వడబోసిన బంగారం రంగు కూడా నీ దేహ వర్ణంతో సాటి రాదు) అని మొదలైన ఆళ్వారుల సూక్తులు భగవంతునకు దివ్య రూపం ఉన్నది అనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

జీవుని శరీరం జీవునకు కూడ రోత కలిగిస్తుంది. కానీ, భగవంతుని శరీరం భగవంతునకు తన దివ్యరూపం కంటే ఎక్కువ ఇష్టంగా ఉంటుంది. ఈ విషయాన్ని శ్రీ యామునులు స్తోత్రరత్నంలో **"శాంతానంతమహావిభూతి పరమం యద్ బ్రహ్మ రూపం హరేః మూర్తం బ్రహ్మ, తతోఽపి తత్ ప్రియ తరం రూపం యదత్యద్భుతమ్"** (భగవంతుని దివ్యాత్మ స్వరూపం శాంత మైనది, అనంత మైనది, దానికంటే భగవంతుని దివ్య మంగళ విగ్రహం చాలా అద్భుతమైనది, భగవంతునకు తన దివ్యాత్మస్వరూపం కంటే మిక్కిలి ఇష్టమైనది) అని తెలిపారు. అందువల్ల భగవద్రూపం భక్తులకు మాత్రమే కాక భగవంతునకు కూడా చాలా అభిమతంగా ఉంటుంది అని తెలుస్తున్నది. **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** అని విష్ణు పురాణం కూడా పలికింది.

భగవంతుని రూపాన్ని దర్శించినవారికి ఇక దేనిపైన ఆశ కలుగదు. అది నిత్యాపూర్వంగా ఉంటుంది కదా. అందుకే దానికి ఆరావముదు అని పేరు. శ్రీరాముని గమన సౌందర్యాన్ని ఎన్నిసార్లు దర్శించినా దశరథునకు ఏనాడూ తృప్తి కలుగలేదు–అని వాల్మీకి మహర్షి **"న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"** అని అన్నాడు. శ్రీరంగనాథుని దివ్య నేత్రసౌందర్యాన్ని దర్శించిన ధనుర్దాసు భౌతికమైన, తన పత్ని నేత్ర సౌందర్యాన్ని విడిచిపెట్టిన ఉదంతం ఇక్కడ

స్మరించదగినది. అంతకుముందు అతడు తన భార్య నేత్రసౌందర్యాన్ని ఎంతో అభిమానించాడు కదా! భగవద్రూపం ఎంతటివారినయినా ఆకర్షిస్తుంది–అనేదానికి, జితేంద్రియులైన దండకారణ్యంలోని మునులు సైతం రామచంద్ర మూర్తి రూపసౌందర్యం చూసి చాలా ఆశ్చర్యపడ్డారు–అని వాల్మీకి పలకడం ఒక ఉదాహరణగా గ్రహించవచ్చు. "**మణివిడంబిని తస్య మనోహరే వపుషి మగ్నమనా మునిమండలీ---జపమముంచత హోమమముంచత--సర్వమముంచత**" నీలమణి వంటి శ్రీకృష్ణుని రూపసౌందర్యాన్ని చూసి మునులు తమ హోమాలను, జపాలను, తపాలను, ఇంకా అన్నిటినీ విడిచిపెట్టారు–అని అన్నాడొక కవి.

తొండరడిప్పొడి ఆళ్వార్లు "**తన్ పాల్ ఆదరమ్ పెరుకవైత్త అళ్గకన్**" (తన విషయంలో భక్తిని కలుగజేసిన సుందరుడు) అని భక్తి కలగడానికి కారణం భగవంతుని దివ్య మంగళ విగ్రహమని అన్నారు. నమ్మాళ్వారు అయితే, ఆ భక్తి తలమునకలుగా వృద్ధి పొందడానికి కారణం కూడా రూపసౌందర్యం అని అన్నారు. "**కాదల్ కడల్ పురైయ విళైవిత్త నమ్ కణ్ణన్**" (నా ప్రేమను సముద్రం నిండినంతగా అభివృద్ధి చేసిన శ్రీకృష్ణుడు) అనే వారి సూక్తి ఇక్కడ స్మరించదగినది.

భగవంతుని దివ్యరూపం ఆ స్వామి దివ్యాత్మ స్వరూపాన్ని ప్రకాశింపజేయగల వైభవాన్ని కలిగినది. శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు దీనిని వివరిస్తూ ఒక మాణిక్యంతో చేసిన పెట్టిలో పెట్టిన బంగారం ఏ విధంగా అయితే స్పష్టంగా ప్రకాశిస్తుందో, ఆ విధంగానే భగవంతుని దివ్య మంగళ విగ్రహంలోని దివ్యాత్మ స్వరూపం చాలా గొప్పగా ప్రకాశిస్తుంది –అని అన్నారు. ఇక్కడ దివ్యాత్మస్వరూపం బంగారంగాను, దివ్య మంగళ విగ్రహం మాణిక్యంతో చేసిన పెట్టెగాను చెప్పబడ్డాయి.

భగవానుని దివ్యరూపం ఇష్ట ప్రాప్తికి, అనిష్ట నివృత్తికి సాధనం అవుతున్నది. ద్వయ మంత్రంలో "**శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే**" అని చెప్పబడింది కదా. ఇక్కడ శరణం అంటే ఉపాయం అని అర్థం. శ్రీమన్నారాయణుని చరణాలను మోక్ష సాధనంగా ఆశ్రయిస్తున్నాను–అని ఈ వాక్యంలోని తాత్పర్యం. ఉపాయం అంటే ఏమి? అని చూస్తే, ఉపాయం అనేది ఇష్టాన్ని కలిగించేది, అనిష్టాన్ని తీర్చేది అయిన సాధనం. ఈ

రెండిటిని భగవంతుని దివ్య మంగళ విగ్రహం కలుగజేస్తున్నది– అని అన్నారు ఆళ్వారులు. తిరుమాలై ప్రబంధంలో తొండరడిప్పొడి ఆళ్వార్ **"శూదనాయ్ కళ్వనాక దూర్తరోడిశైంద కాలమ్"** అనే పాశురంలో **"మాదరార్ కయఙ్కణెన్నుమ్ వలైయుళ్ పట్టఴ్రుంద వేనై, పోదరే! ఎన్ను శొల్లి పుందియుళ్ పుకుందు తన్ పాల్ ఆదరమ్ పెరువైత్త అళ్గకన్"** అని అన్నారు. ఈ సూక్తి లోని భావం ఏమంటే – గతంలో నేను స్త్రీల అందమైన నేత్రాలు అనే వలలో చిక్కుకుని నశించాను. అటువంటి నన్ను దగ్గరకు పిలచి, నా మనసులో ప్రవేశించి, తన పట్ల ప్రేమను కలుగజేసిన సుందరుడు, పరమాత్మ అని భావం). ఇక్కడ గతంలో తాము కలిగి ఉండే లౌకికవిషయ సంబంధాన్ని పరమాత్మ తన అందంతో తీర్చాడు అని, ఆ విధంగానే, ఆ అందంతోనే తనను ఆకర్షించి, మనసులో ప్రవేశించి, భక్తిని పెంచాడు–అని అనడం వల్ల 'లౌకిక సంబంధం తీరి పోవడం' అనే అనిష్ట నివృత్తి, భగవంతునిపట్ల భక్తిని పొందడం అనే ఇష్టప్రాప్తి అనే రెండు భగవంతుని దివ్య మంగళ విగ్రహంవల్ల సిద్ధించాయని తెలుస్తున్నది కదా. ఈ విషయానికి పెరియాళ్వార్ల **"పల పల నాళమ్ శొల్లి పఴిత్త శిశుపాలన్ తన్నై అలవలమై త్తవిర్ త్త అళ్గకన్"** (తన విషయంలో ఎన్నో నిందలు పలుకుతూ మాట్లాడిన శిశుపాలునకు చివరి క్షణాల్లో తన పట్ల విరోధ భావాన్ని లేకుండా చేసిన సుందరుడు) అనే పాశురం కూడా ఉదాహరణ. కృష్ణుని పట్ల ఎంతో క్రోధంతో అతనిని ఎన్నో రీతులలో శిశుపాలుడు నిందించాడు. అంతటి వ్యతిరేకత కలిగిన శిశుపాలుని అతని చివరి క్షణాలలో అతని మనసును మార్చి కృష్ణుని పట్ల అనుకూలతను కలిగేటట్లు ఆ శ్రీకృష్ణుని దివ్య సౌందర్యం చేసింది–అని అంటున్నారు ఆళ్వారులు. దీనివల్ల ఇక్కడ అనిష్ట నివృత్తి మాత్రమే తెలుపబడినా ఇది ఇష్ట ప్రాప్తికి కూడా ఉపలక్షణమే.

భగవంతుని రూపసౌందర్యం భక్తులనే కాదు, విరోధులను కూడా ఆకర్షిస్తుంది. వారిని పరవశుల్ని చేస్తుంది. హస్తినాపురానికి రాయబారిగా వెళ్లిన శ్రీకృష్ణుడు విదురుని ఇంటిలో భుజించాడు. తన ఇంటిలో భుజించకుండా, విదురుని ఇంటిలో శ్రీకృష్ణుడు భుజించినందుకు దుర్యోధనునకు చాలా కోపం వచ్చింది. ఈ విషయాన్నిగూర్చి కృష్ణుని అడిగే ప్రయత్నంలో అతడు శ్రీకృష్ణుని ఉద్దేశించి చేసిన సంబోధన చాలా ఆశ్చర్యకరమైనది. కోపంతో ప్రశ్నించే సమయంలో అతడు శ్రీకృష్ణ

భగవానుని **"కిమర్థం పుండరీకాక్ష! భుక్తం వృషలభోజనమ్"** - "పుండరీక్షా! నీవు విదురుని ఇంటిలో ఎందుకు భుజించావు?" అని అన్నాడు. ఇక్కడ దుర్యోధనుడు శ్రీకృష్ణుని ఇంకొక ఏ నామంతోను నిర్దేశించకుండా నేత్రసౌందర్యాన్ని తెలియజేసే పుండరీకాక్షశబ్దాన్ని ప్రయోగించడం వల్ల అతడు శ్రీకృష్ణుని నేత్ర సౌందర్యానికి పరవశుడయ్యాడు, అందువల్లనే అటువంటి సంబోధనను చేశాడు –అని తెలుస్తున్నది కదా.

తన ముక్కు, చెవులు కోసిన విషయం రావణుని ముందు ప్రస్తావించే శూర్పణఖ రామచంద్రుని, లక్ష్మణుని రూప సౌందర్యాన్ని పొగడుతూ పలకడం కూడా ఇంకొక ఉదాహరణ. ఎంతో కోపంతో పలికే ఆమె నోటివెంట **"తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ మహాబలౌ"** అని వారిద్దరి రూప సౌందర్యాన్ని కీర్తించే మాటలు రావడం ఆశ్చర్యకరంకదా! దీనికి కారణం శ్రీరామచంద్రుని, లక్ష్మణుని దివ్య మంగళ విగ్రహం సౌందర్యం కదా

ఈ దివ్యమంగళ విగ్రహ సౌందర్యానుసంధానం పరత్వం మొదలైన అన్ని రూపాలలోనూ కనిపిస్తుంది. పరమపదంలోని నిత్య సూరులు **"సదా పశ్యంతి సూరయః"** అని ఎల్లప్పుడు పరమపదనాధుని రూప సౌందర్యం దర్శిస్తారు అని చెప్పబడింది. ఇక్కడ **"పశ్యంతి"** అనే శబ్దం ద్వారా పరమ పదంలోనివారు పొందే అనుభవం దివ్యరూపానుభవమే అని తెలుపబడింది. కంటికి విషయం రూపమే కదా. ఇందువల్ల పరమపదంలో నిత్యుల, ముక్తుల అనుభవం కూడా దివ్య మంగళ విగ్రహ దర్శనరూపమైనది అనేది స్పష్టం. వ్యూహంలోని దివ్య మంగళ విగ్రహానుభవాన్ని **"వెళ్ళై వెళ్ళత్తిన్ మేల్ ఒరు పాంబై మెత్తెయాక విరిత్తు అదన్మేల్ కళ్ళనిద్దిరై కొళ్ కిన్ద మార్క్కమ్ కాణలాంగొల్! ఎన్రాశైయినాలే"** (పాలసముద్రంలో తెల్లని ఆదిశేషుని పడుకగా చేసుకుని, దానిపై యోగనిద్రను పొందే స్వామి రీతిని దర్శించగలమా! అనే ఆశతో నా మనసు ద్రవిస్తున్నది. ఆనందం అధికమైనందున మనసు ఉబ్బి తబ్బిబ్బవుతున్నది. రోమాంచం కలుగుతున్నది. కన్నీరు ప్రవహిస్తున్నది. నాకు నిద్ర రావడం లేదు స్వామీ! నిన్ను చేరే దారి నాకు తెలియజేయాలి) అనే పాశురంలో పెరియాళ్వార్లు సూచించారు. ఇక, విభవ రూపంలోని దివ్యమంగళ విగ్రహానుభవాన్ని సూచించే ప్రమాణాలు **"రామః కమలపత్రాక్షః"**

వంటి ప్రమాణాలు చాలా ఉన్నాయి. అంతర్యామి రూపంలోని అనుభవాన్ని "**కొండల్ వణ్ణన్ శుడర్ ముడియన్ నాన్గుతోళన్ కుని శార్ ఙ్గన్---ఒరువన్ అడియేనుళ్ళానే**" (మేఘం వంటి రూపాన్ని కలవాడు, ప్రకాశించే కిరీటాన్ని కలవాడు, నాలుగు భుజాలను కలవాడు, కొంచెం ఒంగిన శార్ఙ్గమనే వింటిని కలవాడు, అద్వితీయుడు అయిన స్వామి నాలో ఉన్నాడు) అనే సూక్తి తెలుపుతున్నది. "**ద్వా సుపర్ణా**" అనే శ్రుతిలోని "**అనశ్నన్ అన్యః అభిచాకశీతి**" (కర్మఫలాన్ని అనుభవించని భగవంతుడు గొప్పగా ప్రకాశిస్తున్నాడు) అనే ఈ ప్రయోగం కూడా దీనిని తెలుపుతుంది. ఇక్కడ ఈ ప్రయోగం అంతర్యామిపరం. "**సమానం వృక్షమ్**" అంటే శరీరమేకదా .శరీరమనే వృక్షాన్ని ఆశ్రయించుకుని ఉండే జీవ పరమాత్మలను ఇద్దరిని రెండు పక్షులుగా ఈ వాక్యం తెలుపుతున్నది. అర్చామూర్తిలోని దివ్య మంగళ విగ్రహానుభవాన్ని "**కొండల్ వణ్ణనై కోవలనాయ్---ఎన్ అరంగనై క్కండ కణ్ గళ్ మట్రొన్రినై క్కాణావే**" (మేఘంవంటి రూపాన్ని కలవాడు, గోపాలుడు అయిన---నా శ్రీరంగనాథుని దర్శించిన నా కన్నులు ఇక వేరు దేనినీ దర్శించవు) అనే మునివాహనసూరి సూక్తి తెలుపుతున్నది.

తనకు మిక్కిలి ప్రియంగా ఉండే భక్తులకు భగవంతుడు ఇచ్చే అమోఘమైన కానుక ఈ దివ్యమంగళ విగ్రహానుభవమే. సీతాదేవి క్షేమం తెలిసికొని తన ప్రాణాన్ని, సీతాదేవి ప్రాణాన్ని రక్షించిన హనుమంతునకు రామచంద్రమూర్తి తన సర్వస్వంగా చెప్పదగిన తన దివ్య మంగళవిగ్రహ సంశ్లేషాన్ని అనుగ్రహించాడు కదా. "**ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః**" అనే శ్రీరామాయణ సూక్తి దీనిని తెలుపుతున్నది.

ఇటువంటి విలక్షణమైన భగవంతుని దివ్య మంగళ విగ్రహానుభవాన్ని మనమంతా పొందాలి. "**కండియూర్ అరంగం మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై ఎన్రు మండినార్**" (తిరుక్కండియూర్, తిరువరంగం, తిరుమెయ్యమ్, తిరుక్కచ్చి, తిరుప్పేర్, తిరుక్కడల్ మల్లై మొదలైన దివ్యదేశాలలో ఆసక్తి కలిగిన వారయ్యారు) అనే విధంగా భగవంతుడు వేంచేసి ఉండే దివ్యక్షేత్రాలను దర్శించి, అక్కడ వేంచేసి ఉండే అర్చారూపాలలోని అందాన్ని పరమ ప్రాప్యబుద్ధితో సేవించాలి.

# భగవంతుని కృతిత్వగుణం

## ('పండితరత్న' ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్య స్వామి వారి వ్యాసం)

భగవంతుడు అనంతమైన కళ్యాణ గుణాలను కలవాడు. అందువల్ల ఆ స్వామికి అనంతుడు అనే పేరు కలిగిందని **"నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయ మవ్యయః"** అనే పురాణసూక్తి తెలుపుతున్నది. ఈ గుణాలలో ప్రతి ఒక్కటి అంతులేని వైభవాన్ని కలిగినది. వాటి అనుభవం ఆనందమయంగా ఉంటుంది. లోకంలో ఉండే పలు గుణాలను కలిగినటు- వంటి పదార్థాల అనుభవం వేరు వేరు రుచులతో కూడినది అయినా, పర్యవసానంలో అన్నీ ఒక అనిర్వచనీయమైన అనుభూతిని కలిగించేటట్లు, భగవంతుని పలు గుణాల అనుభవం కూడా అనిర్వచనీయమైన అనుభూతిని కలిగిస్తుంది. అయితే, లోకంలోని పదార్థాల అనుభవం ప్రాకృతికమై, పరిమితమైన అనుభూతిని కలిగిస్తే భగవానుని గుణాల అనుభవం అంతులేని, పరిపూర్ణమైన ఆనందాన్ని కలిగిస్తుంది. అందుకే పరమాత్మ **"సర్వరసః"** అని సర్వ రసస్వరూపిగా, ఆనందమయుడుగా చెప్పబడ్డాడు.

ఇటువంటి పలు భగవద్గుణాలలో కృతిత్వం అనే ఒక గుణం ఉన్నది. దీనిని గురించి పూర్వాచార్యుల సూక్తులనుబట్టి కొన్ని విషయాలను గమనిద్దాం.

ఈ కృతిత్వం అనే గుణాన్ని యామునులు స్తోత్రరత్నంలో **"వశీ వదాన్యః"** ఇత్యాది శ్లోకంలో ప్రస్తావన చేశారు. భగవంతుడు అన్ని కళ్యాణగుణాలను కలవాడు – అని పలికే సందర్భంలో ఈ శ్లోకం ఉన్నది. ఇందులో పలు గుణాల ప్రస్తావన చేయడం జరిగింది. వాటిలో కృతిత్వం ఒకటి. “**కృతీ కృతజ్ఞః త్వమసి**" – నీవు కృతివి, కృతజ్ఞుడవు– అని అక్కడి సూక్తి. ఈ విధంగానే భగవద్రామానుజులు శరణాగతి గద్యలో భగవానునకు కల అనేక ఆత్మగుణాలను **"స్వాభిమతానవధిక"** ఇత్యాది చూర్ణికలో ప్రస్తావిస్తూ, అందులో **"కృతిత్వ**

**కృతజ్ఞతాద్యసంఖ్యేయకల్యాణగుణగణౌఘ- మహార్ణవ**" అని దీనిని ప్రస్తావించారు.

ఈ గుణనిర్వచనాన్ని పూర్వాచార్యులు ఏ విధంగా చేశారో గమనిద్దాం. ముందుగా స్తోత్రరత్నంలోని సూక్తికి చేయబడిన వ్యాఖ్యానాన్ని చూద్దాం.

శ్రీకృష్ణసూరి అనబడే పెరియ వాచ్చాన్ పిళ్లై స్తోత్రరత్న వ్యాఖ్యానంలో, గద్యవ్యాఖ్యానంలో ఈ గుణాన్ని చాలా అద్భుతంగా వ్యాఖ్యానించారు. స్తోత్రరత్న వ్యాఖ్యలో "**కర్తుమ్ ఉద్యుక్తవాన్. ఇప్పడి ఆశ్రయిత్తాల్ అవర్ కళుడైయ కర్తవ్యాంశమెల్లామ్ తనక్కే అనుష్ఠేయమెన్ఱిరుక్కుమ్. ఆదికర్మణి క్తః**" – కర్తవ్యాన్ని చేయడానికి ఆరంభించినవాడు – అని అర్థం. (ఈ అర్థం ఈ పదంలోని కర్తవ్యాన్ని చేయడం ఆరంభించినవాడు అనే అర్థాన్ని ఇచ్చే 'క్త'ప్రత్యయంవల్ల వస్తుంది). తనను ఆశ్రయించినవారి కర్తవ్యాలను అన్నిటిని తానే చేయాలి అని భావించి, వాటిని చేయడానికి ఆరంభించిన- వాడు. భక్తులు చేయవలసిన కర్తవ్యాలను అన్నిటిని తానే చేసి ముగించి, వారికి వారు పొందదగిన ప్రాప్యాన్ని అనుగ్రహించేవాడు – అని దీని తాత్పర్యం. ఎవడైనా ఒక్కసారి తన విషయంలో చేతులను జోడించి శరణాగతి చేస్తే, ఆ తర్వాత అతడు చేయవలసిన కర్తవ్యాలను అన్నిటినీ భగవంతుడే పూర్తి చేసి వారికి పరమప్రయోజనాన్ని కలిగిస్తాడని దీనివల్ల తెలుస్తున్నదికదా. ఇది ఒక విధమైన కృతిత్వం.

ఈ గుణప్రస్తావన శరణాగతి గద్యలో కూడా ఉన్నదని అనుకున్నాము కదా! అక్కడ ప్రస్తావింపబడిన ఈ గుణాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియ వాచ్చాన్ పిళ్ళై "**ఇవర్ కళ్ కర్తవ్యఙ్గళై అడైయ తానే ఏఱిట్టుక్కొణ్డిరుక్కై, ఆదికర్మణి క్తిన్నంతః**" అని అనడం పై వివరణానికి అనువాదమే. శ్రుతప్రకాశికా- చార్యులవారు కూడా ఈ గుణాన్ని "**కృతం క్రియా, తద్వత్త్వమ్. ఆశ్రితకర్తవ్యస్య స్వయంకర్తృత్వమ్**" – కృతం అంటే క్రియ. దానిని కలిగి ఉండడమే కృతిత్వం. భక్తుల కార్యానలను తానే నిర్వహించడం– అని ఈ గుణాన్ని నిర్వచించారు. ఈ నిర్వచనంకూడా పై వివరణలోకే పర్యవసిస్తుంది. ఇక్కడ కృతమంటే క్రియ అని అనడం – భక్తులు చేయవలసిన కర్తవ్యాలు– అనే అర్థంలో. భక్తుల కర్తవ్యాలను తానే ఆచరించి

పూర్తి చేసినవాడు కనుక భగవంతుడు కృతి, అతని భావం కృతిత్వం.

దీనికి ఉదాహరణగా వరాహచరమ శ్లోకాన్ని శ్రుత ప్రకాశికాభట్టర్ ఉదాహరించారు. "**స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్, తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్**" – తన మనస్సు, శరీరం స్వాధీనంలో ఉన్నప్పుడు, ధాతువులు సరియైన స్థితిలో ఉన్నప్పుడు, ఎవడు ,విశ్వరూపుడను, పుట్టుక లేని వాడను అయిన నన్ను తలుస్తాడో, అతడు, తన చివరి కాలంలో కదలలేని స్థితిలో కట్టెవలె, రాయి వలే పడి ఉన్నప్పుడు అతనిని నేను స్మరిస్తాను. అతనిని ఉన్నత గతికి తీసుకొని పోతాను – అని వరాహ స్వామి అన్నాడు కదా. చివరి సమయంలో కలగవలసిన భగవంతుని స్మరణ కలుగకపోతే ముక్తి కలుగదు– అని శాస్త్రం తెలుపుతున్నది. ఆ కొరత లేనివిధంగా, ఎవడు తన శరీరం సరియైన స్థితిలో ఉన్నప్పుడు భగవంతుని స్మరిస్తాడో అతనిని అతని అంతిమకాలంలో భగవంతుడు స్మరించి , అతడు కోరిన పరమపద ప్రాప్తిని కలిగిస్తాడని దీని భావం. అందువల్ల జీవుడు చేయవలసిన అంతిమ స్మరణం అతనికి బదులుగా పరమాత్మే చేస్తాడని తెలుస్తుంది. ఇది ఒకవిధమైన కృతిత్వం.

వేరొక రీతిలో కూడా ఈగుణం వ్యాఖ్యానింపబడింది. శ్రుతప్రకాశికా చార్యులవారు శరణాగతిగద్య వ్యాఖ్యానంలో "**ఆశ్రిత కార్యపూరణేన కృతార్థత్వం కృతిత్వమ్**" అని నిర్వచించారు. ఆశ్రితులు కోరిన కోరికలను అనుగ్రహించి పూర్తి చేయడమే కృతార్థత్వం అని దీని అర్థం. పెరియవాచ్చాన్ పిళ్ళైకూడా ఈ అర్థాన్ని గద్య వ్యాఖ్యానంలో ఈ విధంగా విలక్షణమైన రీతిలో తెలియజేశారు. "**ఆశ్రితర్ అపేక్షితమ్ పెట్రాల్ అన్ద అపేక్షితమ్ తన్నదాయిరుక్కై**" –భక్తులు తమ కోరికలను పొందితే తాను పొందినట్లే భావించడం కృతిత్వం అని అన్నారు. ఈ విషయాన్నే స్తోత్రరత్నం వ్యాఖ్యానంలో కూడా మరికొంచెం విలక్షణంగా "**ఆశ్రితర్కళ్ తన్నై లభిత్తాల్ ఇళందవర్కళ్ పెట్రారాయిరుక్కైయన్రిక్కే, తన్ పేఱాయిరుక్కై**" – భక్తులు తనను పొందితే, తనను కోల్పోయినవారు తిరిగి తనను

పొందినట్లుగా వారు భావించడం కాకుండా, తానే వారిని తిరిగి పొంది లాభపడినట్లుగా భావించడం– అని అన్నారు.

పై వివరణకు అనుగుణంగా పెరియవాచ్చాన్ పిళ్ళై శ్రీరామాయణంలోని ఒక సందర్భాన్ని ఉదాహరించారు. యుద్ధం అంతా పూర్తి అయిన తరువాత రామచంద్ర మూర్తి విభీషణునకు పట్టాభిషేకం చేశాడు. ఆ సందర్భంలో రామచంద్రమూర్తి స్థితిని తెలిపే ఒక చక్కని శ్లోకం ఇక్కడ ఉదాహరింపబడింది. "**అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్యః తదా రామః విజ్వరః ప్రముమోద హ**" అనేది ఆ శ్లోకం. ఈ శ్లోక భావం ఏమంటే - లంకారాజ్యానికి చక్రవర్తిగా విభీషణుని అభిషేకించిన తరువాత రామచంద్రమూర్తి తన మనస్సులో అంతకు ముందు ఉన్న బాధ తీరినవాడు కావడమే కాకుండా, చాలా సంతోషించాడు – అని. నిజానికి పట్టాభిషేకం చేసికొన్నవాడు విభీషణుడు. అందువల్ల సంతోషించేవాడుకూడా అతడే కావాలి కదా! అతడుకూడా సంతోషించి ఉండవచ్చు కానీ, అంతకంటే ఎక్కువగా శ్రీరాముడు తన మనసులో ఆనందించాడు – అనే విషయం 'ప్ర' అనే ఉపసర్గ ద్వారా తోస్తున్నది. విభీషణుడు సంతోషించాడు, రామచంద్ర మూర్తి అంతకంటే ఎక్కువ సంతోషించాడు – అని ఈ ఉపసర్గ వలన స్ఫురిస్తుంది. రాముడు అంతకు ముందు తన మనసులో కలిగివున్న ఆర్తిని తీరిన వాడై చాలా ఎక్కువగా సంతోషించాడు – అని వాల్మీకి మహర్షి పలకడంలో ఏమి తాత్పర్యం? అనేది కొంచెం గమనించాలి. ఇక్కడ పట్టాభిషేకం చేసికొన్నవాడు విభీషణుడైనా, తన భక్తుడైన అతడు పట్టాభిషేకం చేసికొంటే రాముడు అతని కంటే ఎక్కువగా సంతోషించాడు – అని మహర్షి అనడం రాముని కృతిత్వ గుణాన్ని తెలిపినట్లు కదా. కృతిత్వం అంటే – ఆశ్రితులు తాము కోరిన ప్రయోజనాన్ని పొందితే దానిని తానే పొందినట్లుగా భగవంతుడు భావించడం–అని కదా వివరింపబడింది. అందువల్ల, ఈ సందర్భం శ్రీరామచంద్రుని కృతిత్వగుణాన్ని సూచిస్తుందని తెలియాలి.

ఈ విధంగానే వనవాసం పూర్తి అయిన తరువాత రామచంద్ర మూర్తి భరతుని కలిశాడు. అప్పుడు అతడు ఆ భరతుని కౌగలించుకొని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని ఎంతో సంతోషించాడు – అని మహర్షి వచనం. "**అంకే భరతమారోప్య ముదితః పరిషస్వజే**" అనేది ఇక్కడ మహర్షివచనం. ఈ

సందర్భంలో భరతుడు కూడా సంతోషించి ఉండవచ్చు. ఎందుకంటే, అతడు కూడా రాముని రాకకోసం ఎదురు చూసినవాడే కదా. అయితే భరతుని ఆనంద ప్రస్తావనను మహర్షి చేయలేదు. రామచంద్రమూర్తి పొందిన ఆనందాన్నే ప్రస్తావించాడు. అంటే, రామచంద్రమూర్తికి కల కృతిత్వ గుణాన్ని ప్రస్తావించడంలోనే మహర్షి దృష్టి అన్నమాట. ఇది కూడా శ్రీరాముని కృతిత్వానికి ఒక ఉదాహరణ.

ఈ కృతిత్వగుణాన్నిగూర్చి మరికొన్ని విశేషాలు మరొక సందర్భంలో ముచ్చటించుకుందాం.

